Regd No. M. 1118

సంచిక 2 అణాలు.





# ఆంధ్రపత్రిక

Founder : K. NAGESWARA ROW. SUNDAY EDITION

Vol. 35, ANDHRA PATRIKA, MADRAS. 28th NOVEMBER 1948. No. 235



# స్వాతంత్ర్య దినోత్సవమునాడు స్వతంత్రభారత రాజ్యాంగం అమలు

## "నైరుతి ఆఫ్రికా ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వంలోనే ఉండాలి"

### యూనియన్ అభిమతాన్ని తిరస్కరిస్తూ సర్వసభ్య సమావేశ తీర్మానం

పారిస్, నవంబరు 26: నైరృతిఆఫ్రికాను దక్షిణాఫ్రికాయొక్క ఏకైక ధర్మకర్తృత్వంక్రింద ఉంచుటకంటె ఐక్యరాజ్య ధర్మకర్తృత్వముక్రింద ఉంచుటయే సమంజసమని నేడు జనరల్ ఎసెంబ్లీ తీర్మానించినది. తీర్మానమున కనుకూలముగా 44 గురు, ప్రతికూలముగా 2 రు ఓటుచేసిరి. 5 గురు తటస్థముగ ఊరుకొనిరి.

1946 డిసెంబరు 14 వ తేదీన, 1947 నవంబరు 1 వ తేదీన సమితి దక్షిణాఫ్రికాకు చేసిన ఆదేశములను దక్షిణాఫ్రికా పెడచెవిని బెట్టినందుకు నిరసించుచు, నైరృతి ఆఫ్రికా ఐక్యరాజ్య ధర్మకర్తృత్వము క్రిందకు తేబడవలెనను మరొక తీర్మానమునుగూడ నేడు జనరల్ ఎసెంబ్లీ ఆమోదించెను. దీనికి 32 రు అనుకూలురు, 14 గురు ప్రతికూలురు, 5 గురు తటస్థులు.

బ్రిటన్, ఆస్ట్రేలియా, కెనడా, టర్కీ, బెల్జియం, కొలంబియా, ఫ్రాన్సు, గ్రీసు, ఐస్లెండు, లెబనాన్, లక్జెంబర్గు, హాలండు, పెరూలు దక్షిణాఫ్రికాను సమర్థించుచు ప్రతికూలముగ ఓటుచేసినవి.

తీర్మానముపై చర్చసాగించుచు ఇండియా ప్రతినిధివర్గ నాయకురాలు శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఇట్లు చెప్పెను:

"దక్షిణాఫ్రికా వారు నైరృతి ఆఫ్రికాను కబళించుట తథ్యము. 1946 లో దక్షిణాఫ్రికావారు నైరుతి ఆఫ్రికాను కలుపుకొన గోరినపుడు ఈ సమావేశము నిరాకరించెను. అటుపైన వారా ప్రమేయము మానుకొన్నట్లు తెలిపిరి. కాని వారు క్రమక్రమముగా కలుపుకొను ఏర్పాట్లు చేయుచువచ్చిరి. ధర్మకర్తృత్వ సమ్మతిని దక్షిణాఫ్రికావారు మూడుమారులు నిరాకరించియున్నారు. వెనుకటి లీగ్ ఆఫ్ నేషన్స్ మాండేటు విధానమునకును, నేటి ధర్మకర్తృత్వ విధానమునకును వ్యత్యాసమున్నది. ధర్మకర్తృత్వము కిందనున్న ప్రజలు క్రమముగా స్వతంత్రులగుదురు. వెనుకపడియున్న ప్రజల రాజకీయాభివృద్ధి క్షేమముల బాధ్యతను నిర్వర్తించుటకై ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ విధానము ఏర్పరచెను. ఈ విధానమును దక్షిణాఫ్రికా నిరాకరించుటచే ఆఫ్రికాలోని లక్షలాది వెనుకపడియున్న ప్రజల విముక్తి అంతరించుచున్నది. దక్షిణాఫ్రికా యూనియను పార్లమెంటులో నైరుతి ఆఫ్రికాకివ్వబడిన ప్రాతినిధ్యములో ఆఫ్రికనుల ప్రాతినిధ్యము లేకపోవుటనుబట్టి ఈ విషయము స్పష్టము కాగలదు. నైరుతి ఆఫ్రికాలోని అసంతృప్తికర పరిపాలనను గురించి ధర్మకర్తృత్వ సంఘమువారు పంపిన నివేదనలను ఈ సభవారు సత్రించుటతో ఆగక బలపరిచి ధర్మకర్తృత్వ సంఘము వారిని బలపరచవలెనని మేము చేసిన సూచన చాలా కొద్ది ఓట్లతో వీగిపోవుట శోచనీయము. నైరుతి ఆఫ్రికా వాసులు ఫిర్యాదుచేయు అధికారము కలిగియున్నారు. ఈ అధికారము 80 వ సూత్రములో నున్నది. కాని ఆ అధికారము గురించి ఈ తీర్మానములో ప్రసక్తియే లేకపోవుట శోచనీయము. అక్కడి ప్రజలకు

[8 పేజీ చూడుడు]

### పాక్ విమానం కూలుటవల్ల 21 మరణము

లాహోరు, నవంబరు 26 : పాకిస్థాను ఎయిర్‌వేసు విమాన మొకటి నేటి మధ్యాహ్నము లాహోరుకు 108 మైళ్ల దూరములో షేర్‌హరి అను గ్రామమువద్ద కూలినది. దానిలోనుండిన విమానచోదకు లైదుగురు, ప్రయాణీకులు 16 మంది, మరణించిరి. విమానము కూలుటకు కారణం తెలియలేదు. అ. ప్రె.

## పరిషత్తు కాంగ్రెస్ పక్ష నిర్ణయం

### వృధా కాలహరణమును నివారించేందుకు సభాధ్యక్షునికి అధికారాలు : రాజ్యాంగపరిషత్తు తీర్మానం

న్యూఢిల్లీ, నవంబరు 26 : నేటి మధ్యాహ్నము రాజ్యాంగ పరిషత్తులోని కాంగ్రెస్‌వర్గమువారు కౌన్సిలు భవనములో సమావేశమై రాజ్యాంగపరిషత్తు కార్యక్రమ మీవిధముగా నిర్ణయించిరి : డిసెంబరు 13 సోమవారమునుండి 22 బుధవారము వరకు విరామము. 1949 జనవరి 26 బుధవారమునాడు కొత్త రాజ్యాంగము అమలులోనికి తెచ్చుట.

నవంబరు 30 మంగళవారము నుండియు రాజ్యాంగసభలు, ఉదయము 10 నుండి మధ్యాహ్నము 1 గంటవరకు కాక, సాయంకాలము 3 మొదలు ఎనిమిది వరకును జరుగును.

సమావేశం ప్రారంభంలో ప్రధాని నెహ్రూ కామన్వెల్తు దేశాలు, ఇతర రాజ్యాలతో భారతదేశమునకు ఉండవలసిన సంబంధముల గురించి, భారతదేశ విదేశాంగవిధానము గురించి ఉపన్యసించిరి.

### సభాధ్యక్షునకు విశేషాధికారాలు

#### రాజ్యాంగపరిషత్తుఅమోదం

న్యూఢిల్లీ, నవంబరు 26 : నేటి ఉదయము రాజ్యాంగ సభలో ఇండియా ఐరుల సంబంధం గురించి పండిత నెహ్రూ మాట్లాడిన పిదప రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షునికి లేక ఉపాధ్యక్షునికి సవరణల తోసివేతను గురించి కొన్ని హక్కులిచ్చు ప్రతిపాదనను శ్రీమతి దుర్గాబాయి ఈ విధముగా చేసెను :

"కేవలము మాటలమార్పు, వ్యాకరణపు సవరింపులతో కూడిన సవరణలు తోసివేయుటకును; సవరణలలో సమగ్రమైన, ముఖ్యమైన వాటిని ఏరి చర్చకున్నూ, వోటింగుకున్నూ పెట్టుటకునూ పరిషత్తు అధ్యక్షునికి అధికారముండవలెను. అధ్యక్షుడు ఆమోదించని సవరణలు, ఉపసంహరింపబడనిచో, చర్చ లేకుండా, నేరుగా వోటింగుకు పెట్టబడవచ్చును."

ఈ ప్రతిపాదనను సమర్థించుచు దుర్గాబాయి, సభవారి ఎదుట నాలుగు వేలకు పైగా ఇప్పటికి సవరణ లున్నవనియు, సభవారి కార్యక్రమము త్వరిత మొనరించనిచో సకాలమున పని పూర్తి అనుట దుర్లభమనియు, పని త్వరగా తెమ

6 వ పేజి తరువాయి

### బొంబాయి తుపాను బీభత్సము

#### నష్టం 5 కోట్ల రూపాయలని అంచనా

బొంబాయి, నవంబరు 25 : బొంబాయిలో తుపానువల్ల ప్రభుత్వ ఆస్తికి, ప్రయివేటు వ్యక్తుల ఆస్తికి కలిగిన మొత్తం నష్టం 5 కోట్ల రూపాయలుగా నుండవచ్చునని అంచనా వేయబడినది. హార్బరులో చిన్న స్టీమరులు చాలా మునిగిపోయినవి. అనేక స్టీమర్లు చెడిపోయినవి. పెద్ద, చిన్న విమానములు 30 కి నష్టము కలిగినది. ఆరు బైట నుంచబడిన అన్నిరకముల యంత్రసామగ్రికి విశేషనష్టము కలిగినది. తంతి, విద్యుచ్ఛక్తి, టెలిఫోను స్తంభములు వంగిపోయినవి. తపాలా విద్యుచ్ఛక్తి తీగెలు తెగి చుట్టుకొని పోయినవి. వానిస్థానే క్రొత్త తీగెలు వేయవలసియుండును. అనేక ఫ్యాక్టరీల గొట్టములు కొట్టుకొని పోయినవి. భవనములు, బారకాసులు మున్నగువాని కప్పులు కొట్టుకొని పోయినవి. అ. ప్రె.

## పరిస్థితిని వివరించుటకు రమ్మని చాంగ్‌కైషేక్ కుట్రూమన్ ఆహ్వానం

### అమెరికా వెంటనే సహాయపడేటట్లు చేయడానికి మదాంచాంగ్ ప్రయాణం

వాషింగ్టన్, నవంబరు 26. చైనా ప్రభుత్వ నిజస్థితిని ముందు ఆలోచనలను, సమగ్రంగా విశదీకరించ గలందులకై చైనా అధ్యక్షుడు చాంకైషేక్‌ను ఒకసారి అమెరికాకు పిలిపించవలసినదని న్యూయార్కు డెమొక్రాట్ ప్రతినిధి సాల్‌బ్లూమ్ ట్రూమనుకు సూచించినట్లు నేడతడు పత్రికా విలేఖరులతో చెప్పెను. ఈ సూచనను మొదట నిరాకరించినా తరువాత ట్రూమన్ ఒప్పుకున్నాడని బ్లూమ్ అన్నాడు.

మదాం చాంకైషేక్ త్వరలో అమెరికాకు వెళ్లి చైనాకు తక్షణం సహాయం చేయవలసినదని స్వయంగా విజ్ఞప్తి చేయనున్నదని తెలియుచున్నది. వాషింగ్టన్ లోని విదేశాంగ కార్యాలయసభ్యు డొకడు దీనిని బలపరచెను.

### జన్మదినోత్సవం జరుపవద్దని నాడార్‌కు రాజాజీ తంతి

న్యూఢిల్లీ, నవంబరు 26 : తన జన్మదినోత్సవ కార్యకలాపములను విరమించవలసినదని గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు కామరాజనాడార్ గారికి ఒక తంతివార్త పంపిరి. (అ. ప్రె.)

### అట్లాంటిక్ సమాఖ్య

#### అమెరికాలో సప్తరాజ్య సమావేశము

లండన్, నవంబరు 27 : అట్లాంటిక్ రాజ్యసమాఖ్య విషయమై చర్చించుటకు బహుశా వచ్చే వారములోనే వాషింగ్టన్‌లో సప్తరాజ్య సమావేశము జరుగగలదని ఇచ్చట తెలియుచున్నది.

## 'యధాతధపు ఒడంబడిక కాలపరిమితి పొడిగించ నవసరంలేదు'

### స్వామి రామానందతీర్థ అభిప్రాయం

(స్వకీయవిలేఖరి)

హైదరాబాద్, నవంబరు 25: "యధాతధపు ఒడంబడిక తాత్కాలిక వ్యవహారం మాత్రమే. దీని కాలపరిమితిని పొడిగించనవసరంలేదనుకొంటాను. కాని దీనికి బదులు యేదైనా యేర్పాటు చేసుకొనవచ్చును. అయితే ఇదికూడ తాత్కాలిక మైనదే. సంస్థాన భవిష్యత్తును శాశ్వతంగా పరిష్కరించగలది ఒక్క సంస్థాన రాజ్యాంగ పరిషత్తు మాత్రమే" అని సంస్థానకాంగ్రెస్ అధ్యక్షులు స్వామిరామానందతీర్థగారు, మహబూబ్‌నగర్, రాయచూర్ జిల్లాలలో పర్యటించి తిరిగి యిక్కడకు వచ్చినప్పుడు యధాతథపు ఒడంబడిక కాలపరిమితి అంతమైపోవుచున్నది కాబట్టి, ముందేమి యేర్పాట్లు చేయబడుచున్నవని అడుగగా చెప్పిరి. కాంగ్రెస్‌లోని 'శుద్ధి కార్యక్రమమును' గురించి, కొంతమంది కాంగ్రెస్ సభ్యులపై జారీచేయబడిన సస్పెన్షన్ ఉత్తర్వులను గురించి, "ఇదమిత్థముగా" [illegible] చర్చ [illegible] కాంగ్రెసు ప్రతినిధు [illegible] హైదరాబాద్ కాంగ్రెసు సంఘ సభ్యులు 3332 [illegible] 40 మంది సభ్యత్వము రద్దుచేయబడినది [illegible]" అని

తీర్థగారు చెప్పిరి. రేపు సమావేశమగుచున్న సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గం సస్పెన్షన్ ఉత్తరువులు జారీ చేయబడిన నలుగురు కాంగ్రెసువాదుల విషయమును, కాంగ్రెసు సభ్యత్వం తొలగించబడువారి విషయమును విచారించుటకుగా నియమించబడిన ఉపసంఘముల నివేదికలను పరిశీలించును. నవంబరు 30 న జరుగుచున్న అఖిల హైదరాబాద్ కాంగ్రెస్ సంఘ సమావేశ ఎజెండాను గురించి కూడ ఆలోచించును.

స్వామి రామానందతీర్థగారు రాయచూర్, మహబూబ్ నగర్ జిల్లాలలో పర్యటించి నేటి ఉదయం తిరిగివచ్చి ఆ ప్రాంతాలలోని పరిస్థితి వెనుకగా కొన్ని స్వల్పసంఘటనలు సంభవించుచున్నప్పటికీ, మొత్తం మీద ప్రశాంతంగా నున్నదని చెప్పిరి. కమ్యూనిస్టు బెడద పూర్తిగా సమసి పోవులోపల కమ్యూనిస్టు ఉద్యమం కూడ తగ్గిపోవుచున్నది. "నేరములు [illegible] విడుదలచేయుచున్నారు. [illegible] మామూలు పరిస్థితి [illegible]" అని స్వామీజీ చెప్పిరి.

స్వామిజీ [illegible] ప్రజలు

[8 పేజీ చూడుడు]

## రష్యన్ కలియుగ భీముని మృతి

### మల్లయుద్ధ ప్రవీణుడు ఇవాన్ జైకెన్

మాస్కో, నవంబరు 26 : సోవియెట్ 'కలియుగ భీముడు' అని ప్రఖ్యాతిగాంచిన మల్లయుద్ధ ప్రవీణుడు ఇవాన్ జైకిన్ 66-వ ఏట స్వగ్రామమైన కిషినెవ్‌లో మరణించెను. జైకిన్ అపక్వ మాంసాహారి. ప్రపంచ మంతటిలో అతి బలిష్ఠుడని ప్రతీతి. నేలపై పడుకొని తన ఛాతీమీదుగా ఇతడు మోటారులారీని నడపించుకొనేవాడు. తన విశాల భుజస్కంధాల రెండిటిమధ్యా ఇరికించుకొని తంతి స్తంభాన్ని పెళ్లున రెండుగా విరిచివేసేవాడు. ఇనుపపట్టాను అవలీలగా వర్తులాకారముగ వంచివేసేవాడు.

## పాలస్తీనా విభజనపథకమే ప్రమాణం కావలెనని అమెరికా ప్రతిపాదన

### బ్రిటిష్ తీర్మానములో మార్పు లవసరమని సూచన: సమితి రాజకీయసంఘంలో చర్చ

పారిస్, నవంబరు 26 : పాలస్తీనా సమస్యపై మధ్యవర్తి కౌంట్ బెర్నడోట్ పథకాన్ని సమర్థిస్తూ ప్రతిపాదించిన తీర్మానంలో బ్రిటన్ మరికొన్ని మార్పులు చేయడం అవసరమని అమెరికా ఈరోజు సమితి రాజకీయసంఘం చర్చలో కోరింది. బ్రిటన్ ప్రతిపాదించిన రాజీ తీర్మానాన్ని పార్టీస్తూ అమెరికా ప్రతినిధి డా॥ ఫిలిప్ జెసప్ ఈక్రింది మార్పులు కూడ చేయుట అవసరమనెను: (1) ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశం బెర్నడోట్ పథకాన్ని ఆమోదించుట అవసరమను నిబంధనను తొలగించవలెను. (2) సమితి మొదట ఆమోదించిన పాలస్తీనా విభజన పథకమునే ప్రధానంగాఎంచి బెర్నడోట్ పథకానికి రెండవ స్థానం రాజీసంఘమునకు తదనుగుణమైన ఆదేశముల నివ్వవలెను. (3) స్వస్థానములకు తిరిగి వెళ్ళుటకు ఇష్టపడని అరబ్ శరణార్థులకు పరిహారము విషయమైనపై రాజీసంఘపు అజ్మాయిషీ బాధ్యతను రద్దుచేయవలెను.

అమెరికా ప్రతినిధి తన అభిప్రాయమును తెలిపినపిమ్మట పాలస్తీనా భవిష్యత్తునుగురించి అరబ్బులు సమితి సర్వసభ్యసమావేశము చర్చించవలసిన తమ ప్రతిపాదనను ప్రవేశపెట్టిరి. పాలస్తీనా అంతటినీ అల్పసంఖ్యాకులకు తగిన హామీల నిచ్చే అఖండ అరబ్ యూనిటరీరాజ్యముగ పాలించుట అవసరమని సిరియా ప్రతినిధి ఫరిస్ ఎల్ ఖౌరీ ఒక తీర్మానమును ప్రతిపాదించెను. ఫెడరల్ పద్ధతిపై ఏకైక పాలస్తీనా స్థాపనకు అవసరమయిన ఏర్పాటు చేయుటకూ, పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించుటకు వీలుగా పంచరాజ్య ప్రాతినిధ్యముగల ప్రత్యేకసంఘము పాలస్తీనాకు పంపవలెననికూడ ఫరిస్ ఖౌరీ తీర్మానములో కోరెను:

పాలస్తీనా భూభాగమును అచ్చటి ప్రజాభిమతమునకు విరుద్ధముగ ఆక్రమించుకొను హక్కు లేకపోయినను, రాజ్యస్థాపన చేసిన యూదులను "విదేశీ శరణార్థులుగ" ప్రకటించవలెననికూడ ఈ తీర్మానము కోరుచున్నది.

వివిధ ప్రతిపాదనలను ఒకేఒక పత్రమున పొందుపరచి ఏకరూపమున ప్రతిపాదించుట అవసరమని ఆయా తీర్మానకర్తలను కోరుచూ, రాజకీయసంఘము చర్చను రేపటికి వాయిదా వేసెను.

## "బెదిరింపులకుజంకి కాశ్మీర్‌ను వదులుతామనుకోవడం వట్టిభ్రమ"

### సర్ జఫ్రుల్లాఖాన్‌కు సర్దార్‌పటేల్ సమాధానం

కాశీ, నవంబరు 26 "బయటివారి బెదిరింపులకు హడలిపోవటం, లొంగిపోవటం కలలోనిమాట. కాశ్మీరు ప్రజలు మనతో బంధుత్వమును, సమైక్యతనూ కోరిన పక్షంలో, వారిని ఎన్నటికీ విసర్జించలేమని మన మెన్నోసార్లు ప్రపంచమునకు చాటి చెప్పితిమి. కనుక బయటివారి బెదిరింపులు మనపై పనిచేయలేవు" అని భారత ఉపప్రధాని సర్దార్ పటేల్ నేటి మధ్యాహ్నం ఒక బహిరంగ సభలో ఉపన్యసించుచు కాశ్మీర్ యుద్ధమును గూర్చి ప్రస్తావించెను.

ఆయన ఇంకా ఇట్లా అన్నాడు.

"మనము కాశ్మీరుకు తిరిగి క్రొత్తగా సైన్యములను పంపితిమనీ, వానిని ముందుకురికించుటకు యత్నించుచుంటిమనీ, పాకిస్థాన్ విదేశాంగమంత్రి ఒక చెంప నిలపించుచు, మరొకచెంప తామునూడ సైన్యములను, విమాన బలములను పంపవలసి వచ్చునని బెదిరించుచున్నాడు. ఈ బెదిరింపులకు జడిసి మన మెంతమాత్రమూ లొంగము.

మన దేశాంతర్భాగమును పర దురాక్రమణనుండి రక్షించుకొను నిమిత్తం మనము సైన్యమును, ఆయుధములను పంపుకున్నామంటే, అందుకు మనకు పూర్తిగా హక్కున్నది. మన క్రిందనున్న ప్రాంతములపై ఏదైన దాడిగాని దురాక్రమణగాని జరిగినచో ఇండియా సహింపజాలదని మనము పాకిస్థాన్ విదేశాంగమంత్రిని ముందే హెచ్చరించి యున్నాము. ఇక అతడు గొణగవలసినపని యేమున్నది?"

సర్దార్ పటేల్ ఉపన్యాసమును వినుట కక్కడ 50 వేల మందికిపైగా జనులు సమావేశమైరి.

#### "వచ్చే ఐదేండ్లవరకూ"

దేశములోని వివిధ క్లిష్టసమస్యలను గూర్చి వివరించుచు, రాబోయే 5 ఏండ్లవరకూ మనము చాల గడ్డు పరిస్థితుల నెదుర్కొనవలసి యుండునని అయితే ఇండియాపై మనిష్యమాత్రుడెవ్వడూ దౌర్జన్యహస్తములు వేయలేడనీ ఉపప్రధాని గాఢముగా ఉద్ఘాటించెను.

"ఇండియా సంరక్షణకు మనము అన్ని ఏర్పాటును చేసినాము. అంతరంగికంగా విద్రోహ [illegible] శక్తుల నణచివేసితిమి. అందుచే ఇండియా తన చరిత్రలో ఎప్పుడూ ఎరుగని గాఢ ఐకమత్యమును నేడు పొందగలిగినది ఇండియాకు స్వాతంత్ర్యము రాగానే, అది ముక్కచెక్కలుగా పగిలి

పోవునని ఆశేపులు, ముఖ్యముగా బ్రిటిష్ వారు భావించిరి మత విద్వేషములు, జాతి విద్వేషములు, అసంఖ్యాకమైన సంస్థానములు వీటన్నిటితో ఇండియాలో అరాజకము తప్పదని విదేశీయులనేకులు తలచిరి. మనకు రావలసిన దానికంటె తొందరగా స్వేచ్ఛ వచ్చినదనీ, దానిని కాపాడుకొనే శక్తి మనకు లేదనీ వారు తలపోసిరి. కాని మన వద్దనున్న ప్రేమ అనే ఆయుధమును వారు గుర్తించలేదు.

ఈ ప్రేమతో మనము సంస్థానములను మనతో కలుపుకొని వానిని ప్రజాస్వామిక మొనర్చినాము. "విదేశీయులు మనకు స్వాతంత్ర్యమిచ్చి పోగా, ఇక మీరేల మీ ప్రజల దారికడ్డుగా నిలిచెద' రని మనము సంస్థానాధీశుల నడిగితిమి. వారు మన మాటను విని, అట్లే నడచుకొనిరి.

కాని రెండు సంస్థానములు మాత్రము మన మాట వినలేదు. ఒకటి జునగడ్. జునగడ్ నవాబు గతి ఏమయ్యెనో మీరెరుగుదురు. అతడు జరిగిన దానికి పాకిస్థాన్

(6-వ పేజీ చూడుడు)

### అరబ్బులతో రాయబారాలు

#### యూదు సంసిద్ధత

అరబ్ రాజ్యాలకు బంచ్ వర్తమానం

పారిస్, నవంబరు 26: అరబ్ రాజ్యాలతో ముఖాముఖిగా తక్షణమే శాంతి సమాలోచనలు జరపడానికి యూదుల 'ఇజ్రాయిల్' ప్రభుత్వము సంసిద్ధంగా వున్నదని పాలస్తీనా తాత్కాలిక మధ్యవర్తి రాల్ఫ్ బంచ్ అరబ్ ప్రభుత్వాలన్నిటికీ తెలియజేసినట్లు తెలుస్తున్నది. ఇటీవలనే ఇజ్రాయిల్ రాజధానిఅయిన టెల్‌అవీవ్‌కు పంపిన లేఖకు యూదు ప్రభుత్వం వ్రాసిన సమాధానం ప్రతిని కూడా జతచేస్తూ డా॥ బంచ్ అరబ్ ప్రభుత్వాలకు ఒక లేఖ వ్రాశాడు.

ప్రత్యక్షంగా ముఖాముఖి సంప్రతింపులు జరపడానికి తాము సుముఖంగానే వున్నామనీ, ఇది ఆచారణసాధ్యంగాని పక్షంలో ఐక్యరాజ్యసమితి మధ్యవర్తుల ద్వారా రాయబారాలు జరపడానికి ఏవిధమైన ఆక్షేపణా లేదనీ యూదులు తమ సమాధానంలో తెలియజేశారు.

### కాంగ్రెస్‌సభకై సెలవలు : జయపూర్ ప్రభుత్వప్రకటన

జయపూర్, నవంబరు 26 : అఖిల భారత కాంగ్రెస్ మహాసభ కారణముగ డిసెంబరు 16, 17, 18, 19 తేదీలను జయపూరు ప్రభుత్వము సెలవుదినములుగ ప్రకటించినది. రాష్ట్రపతి పూరేగింపులో ప్రజలు పాల్గొనుటకు వీలుగా డిసెంబరు 15 వ తేదీ సగము సెలవుదినము.







# రైల్వేపనివారు రాయబారములకు విముఖులు కారు

## శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రకటన

నాగపూరు, నవంబరు 26: 'సమ్మె విషయమై వోటు సైకొను తీర్మానము గావించిన తరువాత కూడ రైల్వేబోర్డు, ప్రభుత్వమువారు వాంఛించు నెడల రాయబారములు జరుపుటకు రైల్వేపనివారి ఫెడరేషనువారు విముఖులు కారు కాని ఇట్టి రాయబారములు జరుపుటకు రైల్వేపనివారి ఫెడరేషన్ ముందంజ వేయదు' అని రైల్వే పనివారి ఫెడరేషను సోషలిస్టు అధ్యక్షుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు బొంబాయి వెళ్ళిపోవుటకు పూర్వము పత్రికా ప్రతినిధులతో ముచ్చటించుచు చెప్పిరి.

ఇతర కార్మికులస్థితికంటె రైల్వే పనివారిస్థితి బాగుగానున్నదను నమ్మకమునకు కారణములేదని, జీవితఖర్చు విపరీతంగా పెరిగిపోయినందున హెచ్చుకూలి, గిరాకి అలవెన్సు ఇవ్వవలెనని సామాన్యముగా కార్మికులందరు కోరుట న్యాయమేనని ఆయన చెప్పెను. కేంద్రజీతాల కమిషను సలహాలను కేంద్రప్రభుత్వము నిర్లక్ష్యము చేసిరని ఆయన చెప్పెను.

దేశస్థితి విషయమై మాట్లాడుచు శైశవావస్థయందున్న ప్రజాసత్తాకను రక్షించుటకు ప్రతిపక్ష వర్గముండుట అవసరమనిరి. అన్ని పక్షములవారి అభిప్రాయములను, ముఖ్యముగా ప్రతిపక్ష వర్గమువారి అభిప్రాయములను పత్రికలు ప్రచురించవలెననిరి. సంపాదకీయములలో ఆ యభిప్రాయములను పత్రికలు విమర్శింపవచ్చుననిరి. తాను ఉపన్యసింపవలసి యుండిన సభను మ॥ రా॥ల ప్రభుత్వమువారు నిషేధించుటను ఆయన తీవ్రముగా నిరసించెను. వ్యక్తులను బహిరంగముగా మాట్లాడనివ్వనియెడల మనకు చేకూరిన స్వాతంత్ర్యమువల్ల యేమి ప్రయోజనమని అడిగిరి. అ. ప్రె.

### రెడ్ హిల్సు తటాకము నీటిమట్టం

చెన్నపట్నం, నవంబరు 26: రెడ్ హిల్సు చెరువులో యీనాటికి 38. 6 అడుగుల ఎత్తు నీరు యున్నది. గత సంవత్సరమున యీ తేదీకి 41,17 అడుగుల నీరు యుండెను.

# నేలకొండపల్లి పోలీసు స్టేషన్ పై నిజాం కమ్యూనిస్టుల దాడి

## ఒకపోలీస్ మరణం: కాంగ్రెస్ కార్యాలయం దోపిడి

ఖమ్మంమెట్టు, నవంబరు 26: నిజాం కమ్యూనిస్టులు గతరాత్రి నేలకొండపల్లి పోలీసుస్టేషనుపై దాడిచేసి తుపాకులను కాల్చిరి. స్టేషన్‌లో నున్న పోలీసులలో ఒకడు తుపాకిగుండు తగిలి మరణించెను. ఈ దాడి అనంతరం కమ్యూనిస్టులు ఆ గ్రామంలో నున్న కాంగ్రెస్ కార్యాలయమును దోపిడిచేసిరి. కాంగ్రెస్ ఆర్గనైజరు కంకిపాటి జగన్మోహనరావు గృహంమీద చేతిబాంబులు విసరిరి. కాని ఎవరికీ గాయాలు తగులలేదు.

### రామచంద్రపురం పోలీసు స్టేషన్‌పై కమ్యూనిస్టుల దాడి వివరములు

విజయవాడ, నవంబరు 25: మునగాల పరగణా రామచంద్రపురం గ్రామంలో నున్న యూనియన్ ప్రత్యేక సాయుధ పోలీసుదళశిబిరంపై గత సోమవారంరాత్రి నిజాం కమ్యూనిస్టులు జరిపిన దాడిని గురించిన పూర్తివివరములను తెలియచేయుచు జగ్గయ్యపేట సబ్ మాజిస్ట్రేటు, విజయవాడ సబ్‌డివిజనల్ మాజిస్ట్రేటు శ్రీ. సాంబశివరావు నాయుడుగారికి నిన్న సాయంకాలం రిపోర్టు పంపెను. "నిజాం కమ్యూనిస్టులు క్రొత్తగూడెమునకు చెందిన రామిరెడ్డి అను కమ్యూనిస్టు నాయకత్వమున గత సోమవారంరాత్రి రామచంద్రపురం లోనున్న ప్రత్యేక సాయుధ పోలీసుదళ శిబిరమును, ఆపరిసరములలోనున్న చోళం పైరుగలచేలలో స్థావర మేర్పాటుచేసుకొని, ముట్టడించిరి. కమ్యూనిస్టుల శిబిరంలోకి ఒక చేతిబాంబును విసరిరి. అది ఒక మంచంకింద పడి ప్రేలెను. ఆమంచంపై నిద్రించుచున్న 352 నెం. ఇ. వి. అప్పు అను కానిస్టేబులు వెంటనే మరణించెను. 1216 నెం. వై. నాగన్న, 392 నెం. రాఘవమోనన్ అను 2 కానిస్టేబులకు గాయములు తగిలెను. ఆశిబిరంలోనే ఉన్న కలికోవ గ్రామోద్యోగి అక్కిరాజు కృష్ణారావునకు కూడ గాయములు తగిలెను. శిబిరంలో నున్న కానిస్టేబిలులు బాంబు ప్రేలగానే 301 రౌండ్లు తుపాకులు కాల్చిరి. పోలీసుల నుండి అగ్నివర్షం వచ్చుట చూడగానే కమ్యూనిస్టులు తమవద్ద స్టెన్‌తుపాకులు, 303 తుపాకులు ఉన్నప్పటికీ గాయములు తగిలిన ముదిగొండ వీరయ్య అను కమ్యూనిస్టును, పొలములో వదలివేసి పారిపోయిరి. ఆపొలములో కొన్ని తూటాలు, తుపాకులు కూడ దొరకినవి. ముదిగొండ వీరయ్య మునగాల ఆస్పత్రిలో చేర్చబడిన కొంతసేపటికి మరణించెను. ఇతడు కలికోవ గ్రామానికి చెందిన ప్రముఖ కమ్యూనిస్టు." అని ఆ రిపోర్టులో తెలియజేయబడెను. సంస్థానంనుండి కమ్యూనిస్టు ఉధృతమును రానీయకుండా అరికట్టుటకుగాను మునగాల పరగణా సరిహద్దు పొంబడి ప్రత్యేక సాయుధ పోలీసుదళ శిబిరములు ఏర్పాటు చేయబడినవని తెలియుచున్నది.

# హైద్రాబాద్ రక్షణకు బాంబరు విమానాలు

## లాయకాలీ మంత్రివర్గం తెప్పించిందట

హైదరాబాద్, నవంబరు 24: లాయకాలీ మంత్రివర్గం హైదరాబాద్ రక్షణకుగాను ఒక బాంబరు విమానదళమును తెప్పించినదనీ, నిజాం లొంగిపోయినప్పుడు అది కరాచీలో నున్నదనీ వార్తలు యిక్కడ ప్రచారంలో నున్నవి. కాని వీటి నిజానిజము లింకా ధృవపడలేదు.

ఈ దళము విదేశాలనుండి వచ్చినదనీ, హైదరాబాద్ లొంగిపోయిన రోజున యీ విమానములను పాకిస్తాన్ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నదనీ పై వార్తలు తెలియజేయుచున్నవి.

### సంస్థానంలో ప్రత్తిధరల కంట్రోలు

హైదరాబాద్, నవంబరు 24: హైదరాబాద్ ప్రభుత్వం సంస్థానంలో వచ్చే నెలలో ప్రత్తి ధరల కంట్రోలు అమలు జరుపబోవుచున్నదని అధికారవర్గముల ద్వారా తెలియవచ్చినది. భారతదేశంలో ఉత్పత్తియగు మొత్తం ముడిప్రత్తిలో 10% హైదరాబాద్‌లో ఉత్పత్తి అగుచున్నది. సంస్థానంలో ముడిప్రత్తి ధరలు భారతదేశంలో మిగిలినచోట్లగల ధరలతో సమానంగా నుండునట్లు యిప్పుడు నిర్ణయించబడును.

నిజాం ప్రభుత్వ వ్యవసాయశాఖవారు నాందేడు జిల్లాలో ముడిప్రత్తి ఉత్పత్తియగు 40 వేల యకరాలభూమిని, అక్కడ పండు ప్రత్తి వాణ్యమువేడకుండా చూచు ఉద్దేశ్యంతో స్వాధీనం చేసుకొన్నారని నేడు అధికారరీత్యా ఒక ప్రకటన వెలువడెను. 'ఈ ప్రత్తినుండి సిల్కుదారము వంటిదారము వచ్చును. దీనిని తగువిధంగా రక్షింపనిచో చెడిపోగలదు. అందుచే ప్రభుత్వం దీని విషయమై తగు జాగ్రత్త వహించి పర్యవేక్షణ జరుపుచు రైతులకు ఒక సంవత్సరంతక్కావి బుణంమీద విత్తనములను సప్లయిచేయును. ప్రభుత్వ పర్యవేక్షణకింద పండించబడిన ప్రత్తి మామూలు ధరలకంటె 6% ఎక్కువ ధరకు అమ్మబడినది" అని ఆ ప్రకటనలో తెలియజేయుబడెను.

### ఇండియా నాణెములు

హైదరాబాద్ సంస్థానంలో గల బ్యాంకు లన్నిటిలోను ఇండియా కరెన్సీ నాణెములు కంట్రోలు మారకం రేటుననే విరివిగా లభ్యమగుచున్నవి. మారకంలో యింతవరకు ఉన్న బ్లాకు మార్కెటు పూర్తిగా పోయిందనే చెప్పవచ్చును.

### గాంధీజీ స్మారకనిధి

హైదరాబాద్ సంస్థానంలో గాంధీజీ స్మారకనిధికి యిప్పటివరకు వసూలైన విరాళముల మొత్తం దాదాపు లక్ష 25 వేల రూపాయలు. విరాళములను యింకా విరివిగా సేకరించు ఉద్దేశ్యముతో సికందరాబాద్‌లో రాధాకృష్ణ జోషి సమావేశకర్తగా ఒక ప్రత్యేక సంఘం ఏర్పాటు చేయబడెను.

### 'మురళీ మనోహర్' ఆలయంలో హరిజనుల ప్రవేశం

హైదరాబాద్‌లోని చార్‌మినార్ వద్దనున్న 'మురళీ మనోహర్' దేవాలయం లోకి హరిజనులు సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు డా॥ జి. ఎస్. మెల్కోట్ నాయకత్వాన నిన్న ప్రవేశించిరి. ఈ సందర్భంలో మెల్కోట్‌గారు ప్రసంగిస్తూ, [illegible] శాస్త్రములపై నిర్మింపబడుచున్న నూతన హైదరాబాద్‌ [illegible] కుల, మత విభేదాలు సహింప[illegible]చిరి.

# నైరుతి ఆఫ్రికాపై సమితి నిర్ణయం

1 వ పేజీ తరువాయి

ఎట్టి రాజకీయ హక్కులున్నూ లేవు. తమ భావిని గురించి వారు పెటిషనులు పెట్టుకొనుటకు అవకాశ ముండవలెను. పాలస్తీనా విషయములో అరబు యూదు పక్షములకు రెంటికిని తమ సంగతి చెప్పుకొను అవకాశ మిచ్చితిమి. అట్టి అవకాశము నైరృతి ఆఫ్రికావాసుల కివ్వవలెను. లీగ్ ఆఫ్ నేషన్సు గతించుటచే దక్షిణాఫ్రికావారు నైరుతి ఆఫ్రికాలో తమకు గల పరిపాలనాధికారమును నిరంకుశాధికారముగా మొనర్చి మాండేటు కింద ప్రజల కుండిన హక్కులను తుడిచిపెట్టిరి. మాండేటు ప్రకారము నైరుతి ఆఫ్రికాను పరిపాలింతుమని ద. ఆఫ్రికావారు చెప్పినమాట విశ్వసనీయము కాదు. నై. ఆఫ్రికాను ధర్మకర్తృత్వము కింద పెట్టుటకు ఒప్పుకొనవలసి వచ్చినచో ద. ఆఫ్రికా ఐక్యరాజ్య సమితినుండి నిష్క్రమించ సంసిద్ధమై యున్నది ద. ఆఫ్రికా ప్రధాని నై. ఆఫ్రికాను కలుపుకొందుమని చెప్పినట్లు నావద్ద పత్రికా సాక్ష్యమున్నది. ఈవార్త అసత్యమని ద. ఆఫ్రికా ప్రతినిధి చెప్పియున్నాడు. నై. ఆఫ్రికా సమస్యతో ఇండియాకు ఎట్టి జోక్యము లేకపోయినను, మేము స్వాతంత్ర్యము కొరకు బాధలుపడి, స్వాతంత్ర్యము అవిభాజ్యమని నమ్ముచున్నాము. కనుక నై. ఆఫ్రికావాసుల స్వాతంత్ర్యముకొరకు పోరాడుటమావిధి. వలస విధానమును ఖండించవలసిన ఆసియా రాజ్యముల ప్రతినిధులు ఈ సమస్యపై చీలుట శోచనీయము. ఐక్యరాజ్యసమితి వివిధశాఖలు న్యాయస్థానములుగా మారుచున్నవి. మానవజాతి ప్రాథమికసూత్రములు న్యాయవాదములతో తేలవు. అట్టి పద్ధతులవలన మానవజాతి యొక్క ఆశలను, ఆశయమును సఫలము కాజాలవు."

విజయలక్ష్మి పండిట్ మాట్లాడుట పూర్తికాగానే సభలో కరతాళధ్వనులు చెలరేగెను. హర్షించినవారిలో విషిన్‌స్కీ కూడా ఉండెను.

విజయలక్ష్మి ప్రసంగమునకు సమాధానము చెప్పుచు ద. ఆఫ్రికా ప్రతినిధి, లో, నైరుతి ఆఫ్రికాను కలుపుకొను ఉద్దేశము ద. ఆఫ్రికాకు లేదనియు, అటు చేయుదుమని ద. ఆఫ్రికా ప్రధాని చెప్పినట్లు పత్రికలలో ప్రకటితమైన వార్త అసత్యమనియు, ఇటీవల యూనియన్ (ద. ఆఫ్రికా) పార్లమెంటులో ఇవ్వబడిన ప్రాతినిధ్యమువలన నై. ఆఫ్రికాకు యూనియన్ వలెనే సదుపాయములు కూడా ఏర్పడునని యు, మిగిలిన ధర్మకర్తృత్వ ప్రాంతములకు నై. ఆఫ్రికాకూ తేడాలు కలవనియు, అది అన్నివిధముల ద. ఆఫ్రికాతో చేరి యున్నదనియు, నై. ఆఫ్రికాలో ద. ఆఫ్రికా పరిపాలన సాగుటకు అంతరాయములు కల్పించవలదనియు చెప్పెను.

తీర్మానములోని ప్రధానాంశముపై ద. ఆఫ్రికా పతినిధి వోటుకోరగా, అధ్యక్షుడు డా॥ ఇవాట్, "నై. ఆఫ్రికా ధర్మకర్తృత్వము క్రింద చేర్చబడవలెనని ఈసభవారు నమ్ముచున్నారు." అను అంశముపై వోటుతీసికొనెను. దీనికి 32 రాజ్యముల ప్రతినిధులు అనుకూలముగానూ, 14 గురు ప్రతికూలముగానూ వోటు చేసిరి. 5 గురు తటస్థముగా నుండిరి. సర్వసభ్యసమావేశములో ఏతీర్మానముకాని నెగ్గుటకు మూడింట రెండు వంతుల వోట్లు కావలెను. కనుక 2 వోట్ల మెజారిటీతో ప్రధానాంశము నెగ్గెను.

అనుకూలముగా వోటుచేసిన దేశములలో అమెరికా, రష్యా, ఇండియా, పాకిస్థాన్, బర్మా, చైనామొదలగు దేశములు కలవు. ప్రతికూలముగా వోటు చేసినవారిలో బ్రిటన్, ద. ఆఫ్రికా, ఆస్ట్రేలియా, కెనడా, టర్కీ, ఫ్రాన్సు, గ్రీసు మొదలగు దేశములుకలవు.

# ద. ఆ. భారతీయులు

## దేశాంగమంత్రివద్దకు రాయబారము

ప్రిటోరియా, నవంబరు 25: ద ఆఫ్రికా భారతసంస్థల ప్రతినిధులు దేశాంగశాఖమంత్రి డాంగిస్ వద్దకు రాయబారము వెళ్ళి భారతీయులను ద. ఆఫ్రికానుండి పంపివేయు సూచనకు తీవ్రముగు అసమ్మతి వెల్లడించిరి. ఇట్లు వారిని పంపివేయుట న్యాయశాస్త్రమునకును నీతిధర్మమునకును విరుద్ధమని తెలిపిరి. భారతీయులను ప్రత్యేకించు విధానము భారతజాతీయ గౌరవమునకు భంగకరమనికూడ స్పష్టము చేసిరి.

వారు సమర్పించిన విజ్ఞాపనలో ఈక్రిందివిధముగా కలదు: "ద. ఆఫ్రికా భారతీయులుగా మేము మీవద్దకు రాయబారము వచ్చుచున్నాము. మా స్వదేశము ద. ఆఫ్రికా. ద. ఆఫ్రికా ప్రజల కుండదగిన దృక్పథము నే మేము కలిగియున్నాము. భారతీయులు దేశప్ర[illegible]మైయున్నారు. ఏదేశ[illegible]యులను పంపివేయుజాలరు. ద. ఆఫ్రికా[illegible] పంపివేయబడిన భారతీయులను ఏ[illegible] స్వీకరింపరు. భారత దేశము అంతకంటె స్వీకరింపదు. భారతీయులను ప్రత్యేకించుట మహాకష్టములకు మూలమగును. అందువల్ల దేశఆర్థిక వ్యవస్థయే తారుమారగును. అది జాతివిచక్షణపై ఆధారపడియుండుటచేత సామరస్యము కలుగజేయదు. అనేక దశాబ్దములనుండి ట్రాన్సువాలులో భారతీయులకూడెము లున్నవి. 100 కి 70 వంతులు భారతీయులు అతిబీదలుగా నున్నారు. విద్యాసౌకర్యములు లేకపోవుటచేత భారత బాలురు నిరక్షరాస్యులుగా నున్నారు. జాతివిచక్షణమూపి భారతీయులను పనులనుండి తొలగించుటవల్ల 7 వేలమంది భారతీయులు నిరుద్యోగులుగా నున్నారు. పనులుచూచుకొనుటకు భారతీయులను ఎచ్చటికిబట్టిన నచ్చటికి పోనివ్వవలెను, రైల్వే, తపాలా, పోలీసు, ఇతర ప్రభుత్వ సర్వీసులు భారతీయులకు లభించునట్లు చేయవలెను. భారతీయుల కుటుంబసంఘములను తొలగించుట అనర్థము. సాంఘికభద్రత విషయమున జాతివిచక్షణ యుండరాదు. భారతీయులకు పుష్టికరమగు ఆహారములేదు. తగిన యిండ్లులేవు. క్షయమున్నగు వ్యాధులు వారిలో విశేషముగా ప్రబలియున్నవి.

### మంత్రి సమాధానము

ఇంకా తగ్గించ వీలులేనంతగా దక్షిణ ఆఫ్రికా భారతీయులను తగ్గించుట ద. ఆఫ్రికా ప్రభుత్వలక్ష్యమని దేశాంగశాఖ మంత్రి భారత రాయబారవర్గమునకు సమాధాన మొసగుచు చెప్పెను. భారతీయులను పంపివేయు విధానమును అవలంబించి సంఘర్షణలులేకుండా చేయుట ప్రభుత్వ విధానమనియు, ఇండియా పాకిస్థాను ప్రభుత్వముల సహాయముతో ఈ విధానము మైత్రిభావమున అమలుచేయబడునని ఆతడు చెప్పెను. ఈనున్న భారతీయులను ప్రత్యేకించు విధానము అవలంబింప బడుననిరి. తెల్లవారికి నల్లవారికి సంఘర్షణ యేర్పడకుండా చేయుటయే ఈ విధానముయొక్క ఉద్దేశమనిరి. అ. ప్రె.

# స్వామి రామానంద తీర్థ ప్రకటన

1 వ పేజీ తరువాయి

వారికి ఘనముగ స్వాగత మొసంగిరి, వారు అనేక బహిరంగ సభలలో ఉపన్యసించిరి. రాయచూర్ పట్టణమునకు చుట్టుప్రక్కల గ్రామముల ప్రజలు తీర్థప్రజవలె తండోపతండాలుగా వచ్చి స్వామీజీ దర్శనం చేసుకొనిరి. స్వామీజీకి పలు ప్రాంతాలలో 52 వేల రొక్కం బహూకరింపబడెను.

"ఈ జిల్లాలలోని రైతులు ధాన్య సేకరణ పద్ధతిని గురించి ఆందోళన పడుచున్నారని తీర్థాగారు చెప్పిరి. అనేకమంది రైతులు స్వామీజీకి తమ దుస్థితిని ఎరిగించిరి. వారి కష్టములను తొలగించుటకు గాను తగుచర్య తీసుకొన బడుననీ, సంస్థాన కాంగ్రెస్ యీ విషయాన్ని గురించి యింతకుముందే ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపిందనీ, ప్రభుత్వం కాంగ్రెస్ సిఫార్సులను ఆచరణలో పెట్టగలదని తను విశ్వసించుచున్నాననీ తీర్థాగారు చెప్పిరి

### సంస్థాన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం

హైదరాబాద్ సంస్థాన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘంవారు కాంగ్రెస్ పేరుతో కొన్ని అత్యాచారములు జరిపిన వ్యక్తుల విషయమునుగురించి దర్యాప్తుచేయుటకుగాను ఒక సంఘమును నియమించుచున్నారు. ఈ సంఘంవారు తెలంగాణాలోగల అన్ని జిల్లాలలోను పర్యటించి యీవిషయమునకు సంబంధించిన వివరములను సేకరించెదరు.

### రజాకార్ ఖైదీల విడుదల

చెన్నపురినుండి సంస్థానంలోకి తీసుకొనిరాబడిన 40 మంది రజాకార్ ఖైదీలు వరంగల్లులో గత సోమవారంనాడు విడుదలచేయబడిరి కనిష్ఠ్రవారాలలో మొత్తం 400 మంది రజాకార్ ఖైదీలు వరంగల్లు కొనిరాబడిరి వీరి కేసులను గురించి విచారణ జరిగినపడప వీరిని జట్లు జట్లుగా విడుదల చేసెదరని తెలియుచున్నది

### మోయిన్ నవాజ్ జంగ్

న్యూఢిల్లీ, నవంబరు 23 హైదరాబాదు సంస్థానానికి మాజీవిదేశాంగమంత్రి, ఐక్యరాజ్యసమితి సంస్థాన ప్రతినిధివర్గ నాయకుడునైన నవాబ్ మోయిన్ నవాజ్ జంగ్ తాను నైజామ్ యెడల భక్తి, విశ్వాసాలతో ఉంటానని వాగ్దానం చేస్తూ, హైదరాబాదుకు తిరిగి వస్తానని నైజాముకు లేఖవ్రాసినట్లు తెలుస్తున్నది తనకు అప్పగించబడిన సొమ్ముకూడా సురక్షితంగానే ఉన్నదని ఆయన నైజాముకు తెలియచేశాడట

సాధ్యమైనంత త్వరలో హైదరాబాదుకు తిరిగి రమ్మని నైజాము ఆయనను సూచించాడని కూడా తెలుస్తున్నది

### మదరాసు ప్రధాని

మదరాసు ప్రధాని శ్రీ ఓ పి రామస్వామి రెడ్డిగారు 29 తేదీ ఢిల్లీకి రాజ్యాంగ పరిషత్తు సభలలో పాల్గొనుటకు వెడలెదరు. వీరు బెజవాడ రేడియో స్టేషను ప్రారంభోత్సవమునకు పోజాలరని తెలియుచున్నది.

# మదరాసు రేడియో

## నవంబరు 29 సోమవారం

మదరాసు (2)

7-0 గం స్వాగతం 7-10 తెలుగులో వార్తలు 7-20 రికార్డులు 7-30 అర్ జయలక్ష్మి పాట 8-0 ఇం వార్తలు 8-15 టాకీ రికార్డులు 8-30 కె అర్ జయరామయ్యరు 12-30 హిందూస్థానీ ఇంగ్లీషులో 1-0 మదర్‌నిగ్చి 1-30 ఇ వార్తలు 1-40 ఫిల్ము రికార్డులు 2-5 తెలుగులో వార్తలు 2-15 హిందుస్థానీ తెలుగులో వ్రణనివారణ ప్రసంగం ఆకుయొక్క ప్రసంగం 2-45 రికార్డులు 4-0 ప్రాథమిక పాఠశాలలకు, అరవం 5-30 ఎ ఎస్ చంద్రశేఖరయను పాట 6-0 ఇ వార్తలు 6-30 గ్రామస్థుల కార్యక్రమం మిరియాలకధనం, టి రామచంద్రరావుగారి వ్యాసం విశేషలేఖిటి 7-15 తెలుగులో వార్తలు అబ్దుల కరీంఖాను 7-45 మళయాళ ప్రసంగం 8-0 సుందరితంపి, పాట. 8-30 అర్. కె. శ్రీ కాంతన్ 9-0 ఇ. వార్తలు. 9-15 కుక్క కాటుకి చెప్పుదెబ్బ—పి. వి. రామచంద్రమూర్తి నాటకం. 9-30 రికార్డులు. 9-40 ఎస్. గోదండపాణి, వీణ 10 0 ఫిల్ము రికార్డులు

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 27

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సరకు 1-5 ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 75-14 0 పెట్టె బంగారు తులం 113 8 0 నూరుబంగారు 111-6-0 సిమవెండి తులం 100-8 (రెడీ) 177-0-0 వెండి తులం 1 18 0

పంచదార

| | |
|---|---|
| "కాన్పూరు" (2 అందరు) | రు. 105-12 9 |
| | 106-8 9 |
| బూరా (25 పౌన్లు) | రు. 11-4-0 |
| కలకండ (25 పౌన్లు) | రు. 15-4-0 |

# న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 26:

డిసెంబరు 31 87/31 89 మార్చి 31 82/31 83 మే 31 62/31 62 జూలై 3 80/30 81 అక్టోబర్ 28 58 28 58 డిసెంబర్ 28 40 /జా మార్చి 28 17 / జా మే 27 92/ జా

| | |
|---|---|
| మిడ్లింగ్ పోజరు | 32.87 |
| డిసెంబరు (గరిష్ఠధర) | 31.92 |
| (కనిష్ఠధర) | 31.82 |

## గంటల పంచాంగం

సర్వధారి నా॥ కార్తీక బ|త్రయో॥ 1948 సం॥ నవంబరు 28 ఆదివారం

అ॥త్రయోదశి రా8-16 స్వా రా4-10 వర్జ్యం ప 10-44 ల 12-15 కు

బ॥చతుర్దశి నవంబరు 29 సోమవారం

సో॥ చతుర్దశి రా 1-37 విశా రా3-11 వర్జ్యం ప 9-38 ల11-5 కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక బ|త్రయో॥ ఆదివారం

## ఐర్ - కామన్‌వెల్తు

గత మాసము, లండను నందు జరిగిన అధినివేశ ప్రధానులసభ అనంతరము, బ్రిటిషు కామన్వెల్తు, వట్టి కామన్వెల్తు గమారినది. దక్షిణ ఐర్లెండు (ఐర్) రిపబ్లిక్ చట్టమును ఆమోదించుటచే కామన్వెల్తులో సభ్యరాలుగా లేకపోయినప్పటికీ, పూర్వము బ్రిటనుతో నున్న ప్రత్యేక సంబంధ బాంధవ్యములు యథాప్రకారముసాగుచునేయుండగలవు. బ్రిటన్ ఐర్ ప్రజలను పరాయి దేశస్థులుగ పరిగణించదు. 1948 బ్రిటిషు జాతీయ చట్టము ననుసరించి, వారికి హక్కులుండును. ఐర్ ప్రజలను బ్రిటను పరిగణించినట్లే, తమ దేశములోని బ్రిటిషు ప్రజలను పరిగణించెదమని ఐర్ ప్రధాని కాస్ట్రోలో తెలియజేసెను. ఈ యేర్పాటు ఈ రెండు దేశములకే కాక, కామన్‌వెల్తు దేశములన్నిటికీ వర్తించగలదు. అందువల్లనే భారత ప్రధానామాత్యుడు శుక్రవారము, రాజ్యాంగ పరిషత్తునందు "ఐర్‌తో పౌరస్వత్వహక్కులను, సదుపాయములను యథా పూర్వముగా ఇచ్చి పుచ్చుకొనుటకు భారతదేశము సిద్ధముగ నున్నది. మనకు సరిసమాన హక్కులను, సదుపాయములను ఇచ్చినట్లయిన ఐర్‌ను, ఆ దేశీయులను పరాయివారుగ చూడమని స్పష్టీకరించుచున్నాను" అని తెలియజెప్పెను.

ఈ సందర్భమున ప్రధాని కామన్వెల్తుతో భారతదేశ భవిష్యత్ సంబంధము లెటులుండవలెనను ప్రసక్తిని తెచ్చి ఈ విషయమై త్వరలోనే ఒక పరిష్కారము సిద్ధించవచ్చునని తెలిపెను. లండన్‌నుండి తిరిగి రాగానే పరిషత్తునందుపన్యసించుచూ రాజ్యాంగ స్వరూపము కామన్వెల్తుతో నుండవలసిన సంబంధము పరస్పరము కావని తెలిపెను. సభ్యులకు ఈ వివరణ ఎంతవరకు నచ్చినదనునది వేరు విషయము. ఐర్ చేసిన రిపబ్లికుచట్ట ఫలితముగా, ఆ దేశమునకు, బ్రిటనుకు, కామన్‌వెల్తుకు ఏర్పడగల సంబంధములగురించి, ముచ్చటించవలసివచ్చినప్పుడు, కామన్వెల్తుతో భారతదేశ సంబంధ ప్రసక్తి అందరి మనస్సులందు ఉత్పన్నమవక తప్పదు. అందువల్లనే ప్రధాని ఆ విషయప్రసక్తి చేసెను. కాని విస్పష్టముగ తన అభిప్రాయమును తెలియజేయలేదు. సమయము వచ్చినప్పుడు మరొకసారి దానిని గురించి ప్రసంగింపదలచెదనని వెనుక తెలిపెను.

ఐర్ అవలంబించిన విధానము భారతదేశమునకు అవలంబనీయమని కొందరనవచ్చును. లక్ష్య తీర్మానమునందు తెలియజెప్పినట్లు భారతదేశము సర్వ స్వతంత్ర రిపబ్లిక్‌గా నుండుట తథ్యమని పండిట్ నెహ్రూ తెలిపెను. తాను ప్రతిపాదించిన ఆ తీర్మానమునకు భిన్నముగ ఇప్పుడు నెహ్రూ సలహా నిచ్చుననుట అసంభవము. బ్రిటను, కామన్వెల్తుతో సన్నిహిత సంబంధ, సహకారము లుంచుకొన దలచితిమని తెలియజేసెను. అధినివేశముగా లేనప్పుడు ఇప్పుడున్న సంబంధము ఏ రూపముగ నుండవలెననునదే నిర్ణయించవలసి యున్నది. రాజ్యాంగముగా ఐర్ అన్ని సంబంధములను తెగతెంపులు చేసికొనినప్పటికీ పరస్పర పౌరస్వత్వము మొదలైనహక్కులు పూర్వమున్న సంబంధములను యథాప్రకారము సాగించుటకు తోడ్పడుచున్నవి. కామన్వెల్తు నుండి వెడలిపోయినప్పటికీ ఐర్‌ను కామన్వెల్తులోఉన్నట్లే పరిగణించ కామన్‌వెల్తు దేశములు నిశ్చయించినవి. ఐర్‌కూడ అట్లే భావించుచున్నది. సమానపౌరహక్కులను పరస్పరము గుర్తించుటకు శాసనములో నిబంధన ఏర్పరుచుచున్నది. ఐర్‌కు, బ్రిటనుకు ఆనుయాయితీగా ఉన్న సంబంధ బాంధవ్యములను బట్టి అయితేనేమి, భూగోళరీత్యా ఉన్న సన్నిహితత్వమును బట్టి అయితేనేమి ఈ ఏర్పాటుసులభమైనది. ఆ ఏర్పాటు ఉభయులకు అవసరముకూడ. గత సంగ్రామములో ఐర్ వహించిన తాటస్థ్యవైఖరికి నేడు ఆ దేశప్రభుత్వము తలపెట్టిన రిపబ్లికనుచట్టము స్థిరరూప కల్పన. భూగోళ సాన్నిహిత్యమును బట్టి ఐర్ వైఖరికి తలఊపుట తప్ప బ్రిటనుకు గత్యంతరము లేకపోయినది.

ఈ విధమైన సాన్నిహిత్యము, బ్రిటను, భారతదేశములకు లేదు. పరస్పర పౌరస్వత్వ హక్కులను ఇచ్చిపుచ్చుకొనుట అనునది బ్రిటనుతో ఏర్పరచుకొనుటవల్ల భారత దేశమునకు ఒలికెడిది ఏమీ లేదు. ఈ ఏర్పాటు పాకిస్థానుతో చేసికొనుట వల్లనే ప్రయోజనమున్నది. సింహళము భారతీయులపౌరస్వత్వహక్కులను పరిమితము చేసినది. శ్వేత అధినివేశములు జాతిభేదమును పాటించుచున్నవి. ఏక లక్ష్యము, ఏకాశయము లేని ఈ పరిస్థితిలో భారతదేశమునకు, కామన్‌వెల్తుకు ఏ అంశముమీద సన్నిహిత సహకారము, సంబంధములు ఏర్పడగలవో ఆలోచించవలసియున్నది. బ్రిటనుతోనూ, కామన్‌వెల్తుతోనూ, సంబంధమన్న ఏదో ఒక దేశముతో కొన్ని ఒప్పందములు చేసికొనినట్లుగాక, ఒక కూడలితో చేరి ఒక విధానమును అవలంబించుట యని ద్యోతక మగుచున్నది. అందువల్లనే దానినిగురించి ఇంత రాద్ధాంతము జరుగుటకు కారణము.

## కాశ్మీర్ యుద్ధగమనం

భారత సేనలు కాశ్మీర్ యుద్ధరంగమున కార్గిల్‌లో ప్రవేశించినప్పుడు శత్రు ప్రతిఘటన ఫలితముగ మన సైనికులు ఐదుగురు మరణించిరనీ, 12 మంది గాయపడిరనీ రక్షణశాఖ ప్రకటన తెలుపుచున్నది.

రాజోరీ పూంచ్ ప్రాంతమున భారత సేనలు ఆక్రమించిన భూభాగమును శత్రు నిర్మూలముచేయు చున్నవి.

చకోతీ-టిత్వాల్ రంగములలో శత్రు సైనికులు మన అగ్రస్థానములపై ఇప్పటికీ ఫిరంగి కాల్పులు సాగించుచునేవున్నారు. వాతావరణ పరిస్థితి బాగుగా లేక పోయిననూ రాయల్ ఇండియన్ వైమానికులు పూంచ్ మీర్పూర్ రంగములపై పర్యవేక్షణ జరిపిరి.

జోజీలా కనుమద్వారా ప్రప్రథమముగ కాశ్మీర్ యుద్ధరంగములో టాంకును ప్రవేశపెట్టిన ఖ్యాతి లాన్స్ దఫేదార్ బచ్చన్ సింగ్‌కు దక్కినది. ఇతడు పాటియాలా సంస్థానములో మన్నాల్ తెహసీలు నివాసి. హిమావృత కొండ ప్రాంతముపైగా ఇతడు తన టాంకును నడిపి, శత్రువుపై కాల్పులు ప్రయోగించెను.

# జిల్లా ఆహార సంఘాలు, రేషనింగు సలహా సంఘాలు

## డిసెంబరు 15 లోగా నిర్మాణం పూర్తికావాలని ప్రభుత్వ ఉత్తరువు

చెన్నపట్నం, నవంబరు 27: జిల్లాలన్నిటిలోనూ జిల్లా ఆహార సంఘాలను, రేషనింగు పూర్తిగా అమలుజరుపుచున్న ప్రాంతాలలో (స్టాట్యూటరి రేషన్ ఏరియాస్) రేషనింగు సలహా సంఘాలనూ డిశంబరు 15లోగా పునర్నిర్మించవలెనని మద్రాసు ప్రభుత్వం జిల్లా కలెక్టర్లకు ఉత్తరువు చేసింది.

(1) జిల్లాలలోని ఆహారం నిలవలు సరిపోవునో లేదో, పరిస్థితి ఎట్లున్నదో ఎప్పటికప్పుడు కలెక్టర్లకు తెలియ పరచుటకు, (2) ఆహారపదార్థాల సేకరణ, పంపకం మొదలగు విషయాలనుగురించి కలెక్టర్లకు నివేదించుటకు, (3) ఆహార వ్యవహారాల నిర్వహణకు సంబంధించిన విషయాలను కలెక్టరు సూచనపై పరిశీలించి నివేదించుటకు ఈ జిల్లా ఆహార సంఘాలను పునర్నిర్మించునట్లు ప్రభుత్వ ఉత్తరువులో చెప్పబడింది. రేషనింగు అమలు జరుగుచున్న ప్రాంతాలలో రేషనింగు నిర్వహణవిషయాలలో రేషనింగు ఆఫీసర్లకు సలహా నిచ్చుటకు రేషనింగు సలహాసంఘాలు పునర్నిర్మించబడుచున్నట్లు చెప్పబడింది. జిల్లా ఆహార సంఘాలలో ఈక్రింది సభ్యుల నియమింపబడెదరు. 1 కలెక్టరు (అధ్యక్షులు) 2 జిల్లా సప్లై ఆఫీసరు (కార్యదర్శి) 3. జిల్లారేషనింగు ఆఫీసరు, 4. జిల్లా వ్యవసాయశాఖాధికారి 5. సహకారసంఘాల శాఖ డిప్యూటీరిజిస్ట్రారు 6. జిల్లాలలోని రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు అందరు. 7. జిల్లాలోని కేంద్ర, రాష్ట్ర శాసనసభ్యులందరు 8. ఇరిగేషన్, వర్క్సుశాఖల ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, 9. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, 10. జిల్లా పశువైద్య శాఖాధికారి, 11. జిల్లా కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షుడు, అనధికారసభ్యులు. 1. పెద్ద ఉత్పత్తిదారుల ప్రతినిధి ఒకరు. 2. చిన్న ఉత్పత్తిదారుల ప్రతినిధి ఒకరు. 3. వ్యవసాయకూలీల ప్రతినిధి ఒకరు. 4. జిల్లా వర్తకుల సంఘాల ప్రతినిధి ఒకరు. 5. హరిజనుల ప్రతినిధి ఒకరు. 6. ఒక స్త్రీ ప్రతినిధి. 7. జిల్లా టోకువ్యాపార సహకార సంస్థ (డిస్ట్రిక్ట్ హోల్ సేల్ కోఆపరేటివ్ స్టోర్సు) ప్రతినిధి ఒకరు. 8. ఉభయ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చెంగల్పట్టు, తంజావూరు, ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు జిల్లాలలోని బియ్యపుమిల్లు యజమానుల ప్రతినిధి ఒకరు. అనధికారవర్గ సభ్యులను కలెక్టర్లు నియమించెదరు. ఉత్పత్తిదారుల ప్రతినిధుల నెన్నుటలో, ఇదివరలో ధాన్యసేకరణకు ప్రభుత్వమునకు సహాయ పడినవారిని నియమించెదరు.

రేషనింగు సలహా సంఘాలలో ఈ క్రింది సభ్యులను నియమించెదరు.

1. రేషనింగు ఆఫీసరు. 2. టోకువర్తకుల ప్రతినిధులు ఒకరు లేక ఇద్దరు 3. చిల్లర వర్తకుల ప్రతినిధులు ఒకరు లేక ఇద్దరు, 4. పాపుల ప్రతినిధి ఒకరు, 5. మున్సిపాలిటీ లేక పంచాయతీలో ప్రతి వార్డునుంచీ ఒక్కొక్క ప్రతినిధి. ఈ సంఘానికి రేషనింగు ఆఫీసరు కార్యదర్శిగా ఉండగలరు. మునిసిపల్ కమీషనరు, లేక పంచాయతీ ఆఫీసరు ఎక్స్ ఆఫీషియో సభ్యులుగా ఉండవచ్చును. అధ్యక్ష స్థానానికి సంఘాలు అనధికార సభ్యులలో ఎవరనైనా ఎన్నుకొనవచ్చును. అనధికార సభ్యులందరినీ కలెక్టరు నియమించెదరు.

ఈ సంఘాలు సామాన్యంగా ప్రతి మాసం సమావేశం కాగలవు.

## ఆహారపరిస్థితిపై కౌన్సిల్ చర్చ

### ఇరిగేషన్ ప్రాజెక్టులను గురించి సభ్యుల సూచన

చెన్నపట్నం, నవంబరు 27: మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో నేడుదయం ప్రశ్నల కాలానంతరం ఆహారపరిస్థితిపై చర్చ జరిగింది. ఆహారశాఖామంత్రి డా॥ రాజన్‌గారు ప్రస్తుత ఆహార పరిస్థితిని సమీక్షిస్తూచేయుచూ ఒక పత్రమును సభ్యులకు అందచేసి, దీనిపై చర్చించవలెనని ప్రతిపాదించిరి.

ప్రతికూలపక్షనాయకులు డా॥ వి. కె. జాన్‌గారు వచ్చేఫసలీకి 10 లక్షల టన్నుల ధాన్యమునైనా కనీసం మద్రాసురాష్ట్రమునకు సప్లయి చేయవలెనని రాష్ట్రప్రభుత్వం ఒత్తిడిచేయవలెనని సూచించుచూ ఒక తీర్మానమును ప్రతిపాదించిరి. ఇదివరలో కంట్రోల్స్ రద్దుపరచినందువల్లనే ప్రస్తుత ఆహార పరిస్థితి అసంతృప్తిగా నున్నదనిరి. అయితే రద్దుపరచుటలో మద్రాసు ప్రభుత్వం బాధ్యత ఏమీలేదనిరి. కంట్రోల్స్ లేకుండా పరిస్థితి ఎట్లుండునో ప్రయోగరీత్యాపరీక్షించుట ఒకరీతిగా మంచిదేననిరి.

ఈ రాష్ట్రమునకు వచ్చే ఫసలీకి 10 లక్షల టన్నుల ఆహారపదార్థముల నివ్వవలెననిమద్రాస్ ప్రభుత్వం కేంద్రప్రభుత్వమును కోరింది. 10 లక్షల టన్నులూ పూర్తిగా అందచేయవలసిన బాధ్యత కేంద్రప్రభుత్వముపై నున్నదని డా॥ జాన్‌గారు చెప్పిరి.

అయితే దేశంలో ఉత్పత్తి వృద్ధిచేయుటకు ప్రభుత్వం ముందుగా యత్నించవలెననిరి. ధాన్యోత్పత్తిదారులకు న్యాయమైన ధరల నిచ్చినగాని ఉత్పత్తి వృద్ధిని ప్రోత్సహించుటఅసాధ్యం. గతసంవత్సరం ఆహారం సరఫరానిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం రు 3 కోట్ల 26 లక్షలు వెచ్చించింది. ఈవిధంగా వ్యర్థ వ్యయం చెయ్యడంకంటె ఆహారోత్పత్తిని ప్రోత్సాహపరుచు కార్యక్రమాలను ప్రభుత్వం వెంటనే అమలు జరుపుట మంచిది. పంటనీరు సరఫరానిమిత్తం అమెరికావంటి దేశాలు అపారంగా ధనంవెచ్చించి ప్రాజెక్టులను నిర్మించినవి. వానికి ఇప్పుడు ఆహారోత్పత్తి వృద్ధియగుటయేగాక, వారికర్చు అంతాతీరి, అపారంగా లాభంవచ్చుచున్నది. మన ప్రభుత్వాలుకూడా అట్టి ఇరిగేషన్ ప్రాజక్టుల కార్యక్రమాలను అమలుపరచవలెనని డా॥ జాన్‌గారు చెప్పిరి. ప్రభుత్వాలు స్వయంగా ప్రాజెక్టులను నిర్మించజాలక పోయినచో, ధనికవర్గాలవారిచే ఈ కార్యక్రమాల నిర్వహణకు అవకాశ మివ్వవలెను. అమెరికాలో ఒక కంపెనీవారు 50 మిలియన్ల డాలర్ల ఖర్చుతో మనదేశంలో ఒక ప్రాజెక్టును నిర్మించుటకు సిద్ధంగానున్నారనీ, ఇట్టి అవకాశాలను ప్రభుత్వం ఇవ్వవలెననీ, సంకుచిత తత్వాలనుమాని, దేశక్షేమము నిమిత్తం ధనికవర్గాలు కృషిచేయునట్లు చేయవలెననీ డా॥ జాన్‌గారు చెప్పిరి.

ధాన్యసేకరణ విషయంలో పక్షపాతం చూపబడుచున్నది. దీనిని ప్రభుత్వం మానవలెను. దేశంలో రేషనింగును అమలు జరుపుట సులభమని డా॥ జాన్‌గారు చెప్పిరి. చాటువర్తకాన్ని (బ్లాక్ మార్కెట్) నిర్మూలించుటకు ప్రభుత్వం కఠినమైన శాసనాన్ని ప్రవేశ పెట్టవలెను. అన్ని వస్తువుల ధరలూ పెరిగిపోయినప్పుడు, బస్సు చార్జీలతో సహా, ఇట్టి శాసనం అత్యవసరమని డా॥ జాన్‌గారు చెప్పిరి.

ఇబ్రహీంగారు తిరిగి కంట్రోల్స్ విధించుచున్నందుకు ప్రభుత్వమును అభినందించిరి.

శ్రీ డి. కృష్ణమూర్తిగారు కంట్రోల్స్‌ను తిరిగి అమలు జరిపినంత మాత్రాన సమస్య పరిష్కారం కాజాలదనిరి. దేశంలో బ్లాక్ మార్కెట్‌ను అణచుటలో ప్రభుత్వం బొత్తిగా అసమర్థతను ప్రదర్శించినది:— 8 ఔన్సుల చొప్పున రేషను ఇచ్చుచున్న ప్రాంతాలలో బ్లాక్ మార్కెట్ విపరీతముగా వ్యాపించింది. మిగతాప్రాంతాలలో ధరలు పెరిగిపోయినవి. బ్లాక్‌మార్కెట్‌లో అమ్ముచున్న వారిని నిరించజాలమని వారు చెప్పిరి. వారికి ధరలు న్యాయముగా నిర్ణయించ బడలేదు. ధాన్యోత్పత్తిదారులు నష్టపడకుండా కాపాడ గలిగినప్పుడే పరిస్థితి కొంతవరకూ చక్కబడగలదు.

ఆహారోత్పత్తి వృద్ధికి ముఖ్యంగా ఇరిగేషన్ ప్రాజెక్టులను అమలుజరుపవలెననిరి. 10 లక్షల ఎకరాలను సాగులోకి తేగల రామపాదసాగరం ప్రాజెక్టును మూలపడవేసినట్లు తెలుసుకొని చాల చింతపడుచున్నట్లు చెప్పిరి.

శ్రీ ముత్తురంగ ముదలియార్: ఆ ధాన్యం ఎన్ని సంవత్సరాలకి లభిస్తుంది?

శ్రీ కృష్ణమూర్తి: ఎన్ని సంవత్సరాలైనా కావచ్చును. పది పదిహేను సంవత్సరాలు పట్టవచ్చును. కాని ఈలోగా కాని మరొక 50 సంవత్సరాలకుగాని ఇట్టి ప్రాజెక్టులద్వారా గాక ఇతరత్రా సమస్యను పరిష్కరించగలరా? అందువల్ల ఇట్టి ప్రాజెక్టులను వెంటనే నిర్మించవలెను.

అదనపు జిల్లాలని చెప్పబడే ప్రాంతాలనుంచిఆహారాన్ని తీసుకువచ్చి నగరాలలో ఇచ్చుచున్నారేగాని, అక్కడ ప్రజలకు ఆహారం ఎటు లభించుచున్నదో, ఎంత ధరలున్నవో ప్రభుత్వం లక్ష్యపెట్టుటలేదు. భారతప్రభుత్వాన్ని ఎంత కోరినప్పటికీ, అయిదారులక్షల టన్నులకంటె సాలీనా మన రాష్ట్రానికి కివ్వజాలరని శ్రీ కృష్ణమూర్తిగారు చెప్పిరి. అందువల్ల ఆహారోత్పత్తి వృద్ధిని ప్రోత్సహించు కార్యక్రమాలను జాప్యం చెయ్యకుండా అమలు జరుపు బాధ్యత మద్రాసు ప్రభుత్వంపై ఉన్నదనిరి.

శ్రీ ముత్తురంగ మొదలియార్ ప్రభుత్వం గిడ్డంగులను నిర్మించి స్వయంగా ఆహారమును నిలువచేయవలెనని చెప్పిరి. దీనివలన ప్రభుత్వమునకు ఆర్జనవృద్ధి కాగలదు. బ్లాక్‌మార్కెట్‌ను అణచుటకు ప్రభుత్వం తీవ్రచర్యలను తీసుకోవలెననిరి.

కంట్రోల్ తొలగించినతరువాత బ్లాక్ మార్కెట్‌ధరలుతగ్గినవనీ, తిరిగి కంట్రోలును విధించగలరని ప్రకటించగానే బ్లాక్ మార్కెట్ ధరలు పెరిగినవని చెప్పిరి. వ్యవసాయదారులకు ప్రభుత్వం చేయుచున్న సహాయం అల్పంగా ఉన్నదనిరి. కంట్రోల్స్‌ను పూర్తిగా తొలగించి, రవాణాపై నిషేధాలను తొలగించి, వర్తకులకు పూర్తి స్వేచ్ఛ నిచ్చినచో దేశంలో ఆహారపరిస్థితి పరిష్కారం కాగలదు. అంతేగాని రామపాదసాగరం వంటి పెద్ద ప్రాజెక్టులు ఇప్పుడు పరిష్కరించజాలవని మొదలియార్‌గారు చెప్పిరి.

అబ్దుల్ లతీఫ్ ఫరూఖీగారు తిరిగి కంట్రోల్ విధించు విధానమునకు ఆమోదము తెలిపిరి. యం. డి. టి. కుమారస్వామిగారు ప్రభుత్వ ధాన్యసేకరణ విధానంవల్ల సామాన్యంగా ధాన్యం కూలిగానో మజూరిగానో ఈనాముగానో పుచ్చుకొను గ్రామసులకు అది దక్కుటలేదనీ, పేదలను ఇట్టి కష్టములకు లోనుచేయకుండా జాగ్రత్తవహించినచో కంట్రోల్ విధానం సమస్యను పరిష్కరించగలదనిరి.

శ్రీమతి మోనా హెన్స్‌మన్‌గారు మనుష్యుల శారీరకస్థితినిబట్టి రేషనులను నిర్ణయించి, రేషనింగును పల్లెప్రాంతాలలో కూడా పూర్తిగా అమలు జరిపినచో సమస్యను సులువుగా పరిష్కరించవచ్చుననిరి. విదేశాలనుంచి పెట్టుబడి తెచ్చుకొని మన కార్యక్రమాలను నిర్వహించుటవలన దేశమును అమ్ముకొన్నట్లగుననిరి. ఆహారం కొనుటకు ప్రభుత్వం వెచ్చించుచున్న ధనం సాలీనా కొన్నికోట్లగుచున్నది. దీనినే వెచ్చించినచో మన ప్రాజెక్టు కార్యక్రమాలను నిర్వహించవచ్చుననిరి.

శ్రీ మోతే నారాయణరావుగారు గోదావరి కృష్ణాజిల్లాలలో బసంగి మొదలగు ధాన్యాలు ఇదివరలో మార్కెట్టులోకి వచ్చినవనీ, వీనికి ధరల హెచ్చింపును అమలు జరుపవలెననీ చెప్పిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు రైతు సంఘం ధాన్యం వెల మణుగు కనీసం రు 9 నిర్ణయించవలెనని సూచించినది. ఈ విషయములలో ప్రభుత్వం శ్రద్ధవహించి ధాన్యోత్పత్తిని ప్రోత్సహించవలెననిరి.

మంత్రి డాక్టరు రాజన్‌గారు చర్చకు సమాధాన మిచ్చుచూ ఆహారసమస్యను పరిష్కరించుటను సర్వపక్షాలవారు ప్రభుత్వానికి సహాయపడుచున్నందుకు కృతజ్ఞత తెలిపిరి.

ఈ రాష్ట్రంలో ఆహారం ఉత్పత్తియగుచున్నది చాలదని అందరికీ తెలుసును. ఉత్పత్తి వృద్ధిపరచవలసిన అగత్యం గురించి వివాదం లేదు. ఆహారం పంపకాన్ని కంట్రోల్ చేయుటతప్ప మార్గాంతరం లేదు. ఆహారోత్పత్తివృద్ధికిగాని కంట్రోల్ విధించుటకుగాని కేంద్రప్రభుత్వంతో సహకారంచేయక తప్పదు. దేశంలోని ఆహారాన్ని దిగుమతిచేసే ఆహారాన్ని అన్నిప్రాంతాలూ సమరీతిగా పంచుకోవలెను. స్వయంగా ఈ రాష్ట్రం దిగుమతి చేసుకోకపోవడానికి ఇదే కారణం. అంతర్జాతీయ ఆహారసంస్థకూడా వివిధదేశాలమధ్య సమరీతిగా ఆహారం పంచుచున్నది.

కంట్రోల్ తొలగించినందువల్ల ధరలు విపరీతంగా పెరిగిపోయి పరిస్థితి ప్రభుత్వానికి స్వాధీనంకాకుండా పోయింది. అందువల్ల కంట్రోల్ విధించక తప్పినదికాదు.

1948 లో 596000 టన్నుల ఆహారమును భారత ప్రభుత్వం ఇచ్చింది. కాని ప్రజలకు పూర్తిఅవసరాలనుతీర్చవలసినచో సాలీనా 10 లక్షల టన్నులు కావలసియుండును. అయితే ప్రస్తుత పరిస్థితిలో భారత ప్రభుత్వం ఇంత సప్లై చేయజాలక పోవచ్చును. అందువలన రేషన్ ప్రమాణాన్ని 12 ఔ॥ కు పెంచుటకు వీలులేక పోవచ్చును. వరి మాత్రమే కాక ఇతర ఆహార పదార్థాలను కూడా వినియోగించుటను ప్రజలు నేర్చుకోవలసి యున్నారని మంత్రిగా రనిరి. జొన్నలు, చోళ్లు మొదలగు వానిని వాడవలెననిరి. ఆహార సమస్యను పరిష్కరించుట సాధ్యమే గాని అది ప్రజల సహకారంపై ఆధారపడి యుండుననిరి.

సభ ఫలహారమునకు విరమించినది.

## రేషనింగు కంట్రోళ్లకు ప్రాతికూల్యము

కడప, నవంబరు 21: కడపజిల్లా హరిజనుల మహాసభ 19 న సి. ఎల్. నరసింహారెడ్డిగారి అధ్యక్షతను జరిగెను. వై. మాకయ్య; పెంచలయ్యగార్లు ఉపన్యసించిరి. ధాన్యముపై మరల కంట్రోళ్లు పెట్టరాదని, ఈ జిల్లాలో రేషనింగు ప్రవేశ పెట్టకూడదని ప్రభుత్వమును కోరుచూ ఒక తీర్మానము చేసిరి. హరిజనులు ఏండ్లనాలది కష్టపడి సేద్యమునకు యోగ్యముగా చేసిన బంజరుభూములకు హరిజనులకే పట్టాలివ్వవలెనని, మద్యనిషేధ ప్రచారకులుగా జిల్లాకు ఇద్దరు హరిజనులను నియమింపవలెననియు ప్రభుత్వమును కోరుచూ తీర్మానించిరి. కమ్యూనిస్టుల విధ్వంసక చర్యలను ఖండించుచుకూడ మొక తీర్మానము చేసిరి.

# దేశ ఆహారపరిస్థితి

## కలకత్తాలో వివిధ ఉద్యోగుల పరిశీలన

### 20 లక్షల బియ్యం దిగుమతులు తగ్గిపోయే ప్రమాదం

కలకత్తా, నవంబరు 26: కేంద్రరాష్ట్ర, సంస్థాన ప్రభుత్వాలకు చెందిన దాదాపు 60 మంది ఆహారశాఖోద్యోగులు ఇండియా ప్రభుత్వ ఆహారశాఖ కార్యదర్శి ఆర్. ఎల్. గుప్తగారి అధ్యక్షత క్రింద సమావేశమై దేశ ఆహార పరిస్థితిని చర్చించిరి. 1949 మొదటి ఆరుమాసములలో మన దేశానికిరాగల ఆహారదిగుమతులను గురించి తెలియజేసిరి. బియ్యపు తప్ప, మిగత ఆహార ధాన్యముల దిగుమతి సక్రమముగనే వుండగలదనిరి. 1949 జూన్ మాసాంతము లోపుగా రమారమి 20 లక్షల టన్నుల ధాన్యము విదేశములనుండి రాగలదనీ, జూలై మొదలు ఇదివరకువలె దిగుమతులు వచ్చునని ఆశ కనబడదనీకూడా గుప్తాగారు స్పష్టపరచిరి.

అందుచేత మొదటి ఆరునెలల్లోవచ్చు దిగుమతులనే 1949 ఉత్తరార్థమునకు మిగుల్చుకొనవలెననీ, దేశములో బియ్యం సప్లయి పరిస్థితి కొంతవరకు క్లిష్టముగ నుండుననీ అనిరి. ఇండియాకు ప్రధానముగ బియ్యము బర్మా, సయాములనుండియే రావలసివున్నదని సయాంనుండి గత సంవత్సరముకంటె ఎక్కువగా రావచ్చుననీ, బర్మానుండి బియ్యము ఎంతవరకు దిగుమతి కాగలవో చెప్పుటకు సాధ్యపడదనీకూడ గుప్తాగారు అభిప్రాయపడిరి. ఈ కారణముచేత బియ్యము విషయమున దేశము స్వయం కృషిపైనే ఆధారపడవలెను. ఈ విషయము నంతటినీ దృష్టిలోవుంచుకొని, వివిధ ప్రాంత ప్రతినిధులు తమతమ అవసరములను పునఃపరిశీలన చేసుకొనుట అవసరమని గుప్తగారు హెచ్చరించిరి. వివిధప్రాంతములలో పునాసపంటల పరిస్థితిపై నేడు సాధారణ చర్చ జరిగినది. నూతన ఆహార విధాన ఆచరణ కూడ చర్చకు వచ్చెను.

## చందమామవద్దకు ఆకాశనౌకా యాత్ర

### బ్రిటిష్ యింజనీర్ల విచిత్ర పథకం

లండను, నవంబరు 25: పరస్పర గ్రహసన్నివేశ పరిశోధక బ్రిటిష్ సంఘము గత వారము లండనులో సమావేశమై చంద్రగ్రహమువద్దకు ఒక ఆకాశ నౌకద్వారా యాత్ర సాగించుటకు అవకాశములు కలవని నిరూపించెను. ఈ సమావేశములో 100 మంది ఇంజనీర్లు గణిత శాస్త్రజ్ఞులు, విద్యార్థులు కలరు. వీరిలో ఇద్దరు స్త్రీలు కూడా కలరు.

భూమండలమునకు 22 వేల మైళ్ల ఎత్తున 2 వేల టన్నుల ఆకాశనౌక నొకదానిని నిర్మించుటకు వీలున్నదనియు అందుకు కావలసిన విధానమునంతను తాను నిర్ణయించితిననియు రేడియో ఇంజనీరగు హెచ్. ఇ. రాస్. గారు సభలో వివరించిరి. వీరికి యాపథకనిర్ణయములో ఆర్. ఏ. స్మిత్తుగారు తోడ్పడిరట. 22 వేల మైళ్ళ యెత్తున నిర్మింపబడు ఈ ఆకాశ నౌకయొక్క వివిధభాగములు ఆ ఎత్తునకు రాకెట్లద్వారా మనుష్యులు తీసికొని వెళ్లెదరట.

ఈ ఆకాశనౌక కొబ్బరిచిప్ప ఆకారముగా నిర్మింపబడును. అది అంతయెత్తున గిరగిర తిరిగి ఆత్మప్రదక్షిణము చేయునట్లుగా నొనర్పబడును. అది ఆరీతిగా తిరుగుటవల్ల దానికి ఆకర్షణశక్తి ఏర్పడును ఆ నౌక సూర్యునిలోని శక్తిని కొంత తనలోనికి ఘనుకూర్చుకొనును. తద్వారా దానిలో టెలివిజను యంత్రం (దూరదృశ్య చలన చిత్ర ప్రదర్శ) పనిచేయును. ఆయంత్రము ద్వారా తిరిగి ఆ చలనచిత్రములు ప్రతిబింబిత మొనర్పబడును. సప్లయి నౌకలు కొన్ని మూడుమాసములకొకసారి వెళ్లి ఆహారపదార్థములను సప్లయిచేయును. కావలసినగాలిని నీళ్ళను తయారుచేసికొనుటకు వీలుగా హైడ్రోజనుపరాక్సయిడ్ కూడా తగినంత సప్లయి చేయబడుచుండును.

అణుశక్తితో పనిచేయగల యంత్రము 50 సం॥ముల కాలములో చాలావరకు వృద్ధిపొంది మనము కోరిన ప్రయోజనములకు ఉపయోగింప వీలుగా చేయబడును. అణుశక్తి యింజనుల మూలముగా యీ ఆకాశనౌకలను సూర్యాకాశములో నడిపించవచ్చునని యీ శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు.

## ప్రీవీ కౌన్సిలు సమావేశము

లండన్, నవంబరు 23: అస్వస్థులై వున్నట్లు ప్రకటించిన తరువాత, మొదటిసారిగా రాజుగారు నేడు బకింగ్‌హాం రాజభవనమున ప్రీవీకౌన్సిలు సమావేశము జరిపిరి.

# చైనా రాజధానికై త్వరలో భీకరయుద్ధం

## సుచౌలో తిరిగి మాదే పైచెయ్యి అని ప్రభుత్వ ప్రకటన

నాంకింగు, నవంబరు 27: ఇప్పటికి మూడువారాలనుంచీ మధ్యచైనాలో ప్రభుత్వసేనలకు, కమ్యూనిస్టులకు జరుగుచున్న హోరాహోరీ యుద్ధం ఇక కొన్నిరోజులలోనే భయంకరమైన పరిణామానికివచ్చి మిన్నుముట్టే సూచనలు కనబడుచున్నవి. చైనా రాజధాని నాంకింగ్ నగర బాహ్యరక్షణ వలయాలపై కమ్యూనిస్టులు తమ విజృంభణను తీవ్రతరం చేస్తున్నారు.

కీలకనగరం సుచౌకు పక్కవాటుగా దాటి పురోగమిస్తున్న కమ్యూనిస్టు సైనికులు, నాంకింగుకు 100 మైళ్లు ఉత్తరంగా వున్న పెంగ్పూ పట్టణానికి ముప్పు తెచ్చిపెట్టారు. సుచౌలో ప్రభుత్వ సేనలతోపాటు చక్రబంధ ప్రమాదంలో చిక్కుబడిన రాయిటర్ విలేఖరి విలియంపోరట్ నగరంలోని మార్షల్ చాంగ్‌కైషేకి సేనానులు విజయము తమకు తప్పదనే అభిప్రాయపడుతున్నట్లు వ్రాస్తున్నాడు. సుచౌలో ప్రభుత్వసేనలదే తిరిగి పైచెయ్యిగా వున్నదనీ, అక్కడ జరిగిన ఘోర యుద్ధాలలో 96 వేలమంది ప్రభుత్వసైనికులకే అపాయాలు సంభవించగా, 2 లక్షల 38 వేలమంది కమ్యూనిస్టులు హతులైనారనీ మేజర్ జనరల్ చాంగ్ యుచిన్ ప్రకటిస్తున్నాడు.

సూసీన్‌నుంచి లింగ్పీవరకుగల 40 మైళ్ల ముఖమున, సూచౌ పెంగ్పూలమధ్య తీవ్ర సమరము జరుగుచున్నదని ప్రభుత్వ వర్గములు ప్రకటించెను.

కమ్యూనిస్టు ముఖ్యసేనలు సూసీన్‌దాటి ఉత్తర ఆనీ రాష్ట్రంలోనికి చొచ్చుకొని వచ్చుచున్నట్లు ఇతర వార్తలవలన రూఢి అగుచున్నది.

నాన్కింగుకు నూటిమార్గమును నిరాటంకము చేయుటకు ఒక కమ్యూనిస్టుసేన లింగ్పీకి 80 మైళ్లదూరముననున్న సూయినింగ్‌వద్దకు దక్షిణాభిముఖమై నేడు నడచెను. అచటనుండి అది పెంగ్పూ పోవును. మరియొక కమ్యూనిస్టుసేన సూచౌకు పశ్చిమముననున్న తాంగ్‌హోసాన్ మూసీసులకు మధ్యనున్నది. మూసీనకు దిగువను కమ్యూనిస్టుసేనలను ప్రభుత్వసేనలు ప్రతిఘటించుచున్నవి. పశ్చిమమున హోనాన్ రాష్ట్రమునుండి మరి మూడు ప్రభుత్వ సైనిక సమూహాములు వచ్చుచున్నవి.

ఈశాన్య చైనాలోని హొంటూంగ్ రేవు సమీపమున ప్రభుత్వ నౌకాబలములు 50 కమ్యూనిస్టు పడవలను నాశనము చేసినట్లు రాయిటరు వార్త వచ్చినది.

టీన్‌ట్సిన్‌నుండి షాంఘైకి 232 విదేశీయులను తీసుకొని రెండవ అమెరికను నౌక పోయినది. ఇందులో 7 గురు బ్రిటిషువారు, 4 గురు ఆస్ట్రేలియనులు, 165 మంది ఏ దేశమునకు చెందనివారు.

అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో నుండి సోమవారము బయలుదేరి రానున్న "రిపబ్లిక్" అను యుద్ధరవాణా నౌకపై పోవుటకు చైనాలోని 160 మంది అమెరికనులు సిద్ధముగా నున్నారని షాంఘైలోని అమెరికను కాన్సలేటువారు తెలిపిరి.

నిన్న సాయంకాలము "ససెక్స్" అను బ్రిటిషు యుద్ధనౌక టీన్‌ట్సిన్ చేరెను.

## ఐర్లెండ్‌సర్వస్వాతంత్రత బిల్లుకు పార్లమెంటు ఆమోదం

డబ్లిన్, నవంబరు 25: బ్రిటిష్ కిరీటానికి ఐర్‌కు గల సంబంధములన్నిటినీ త్రెంచివేస్తూ ఐర్‌ను "ఐర్లెండు రిపబ్లిక్"గా చేయగల బిల్లును నేటిరాత్రి ఐర్ పార్లమెంటు రెండవసారికూడా ఆమోదించినది. జనవరి 21 వ తేదీకి బిల్లు శాసనమై అమలులోకి రాగలదని విదేశాంగమంత్రి సియన్ మెక్‌బ్రైడ్ అన్నాడు.

బిల్లుపై చర్చ జరుగుచుండగా సియన్ మెక్‌బ్రైడ్ అడ్డువచ్చి, బ్రిటన్, దక్షిణాఫ్రికా, కెనడా ప్రభుత్వములు పంపిన వర్తమానములను సభ్యులకు చదివి వినిపించెను. కామన్వెల్తులోనుండి ఐర్ విడిపోయినా, దాని ప్రత్యేక హోదాను మన్నించుటకు, తమ దేశములలోని ఐర్ జాతీయుల ప్రతిపత్తులకు హాని కలిగించకుండుటకు ఆయాప్రభుత్వములు సమ్మతించినవి.

పార్లమెంటులోని అన్నిపార్టీలు బిల్లును సమర్థించినవి. సెనేట్ కూడ ఆమోదించిన పిదప దానిపై ఐర్ అధ్యక్షుడు సంతకము పెట్టును.

## ఎరువులపై కంట్రోలు రద్దు

చెన్నపురి, నవంబరు 27: వేరుసెనగ పిండి, తదితర ఎరువులమీద ప్రభుత్వం కంట్రోలును పూర్తిగా రద్దుచేయగలవని ఆహారశాఖా మంత్రి డా॥ రాజన్‌గారు నేడు మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలులో ఆహారపరిస్థితి చర్చపై సమాధాన మిచ్చుచు ప్రకటించిరి.

